THE

# SRINGARATILAKA.

# శృంగారతిలకము

BY

TADURI LAKSHMI NARASIMHA RAO.

తాడూరి లక్ష్మీనరసింహారావు పంతులు

*TOWN SUB MAGISTRATE,*

**CUDDAPAH.**

**FIRST EDITION**

1000 COPIES.

COCANADA TOWN

PRINTED BY MESSRS. G. VENKANNA BROS. AT THEIR MANORANJANI PRESS.

1910



**Price** **One Anna.**

# THE

# SRINGARATILAKA.

# శృంగారతిలకము

BY


**TADURI LAKSHMI NARASIMHA RAO.**

తాడూరి లక్ష్మీనరసింహారావు పంతులు

*TOWN SUB MAGISTRATE,*

**CUDDAPAH.**



**FIRST EDITION**

1000 COPIES

COCANADA TOWN

**PRINTED BY MESSRS. G. VENKANNA BROS. AT THEIR MANORANJANI PRESS.**

1910


---



Price One Anna.

# PREFACE.

**The Sringaratilaka,** or 'Ornament of Love', is a small lyrical poem originally written in Sanskrit by poet Kalidasa. It consists of thirty stray stanzas, in which an amatory situation and sentiment are graphically depicted. I translated it in the year 1905, while at Kadiri. I originally intended it for private circulation. Some of my literary friends who have read it have, however, urged me to print and publish it. I also find that, speaking of its original in the Imperial Gazetteer of India, so great a critic as Dr. A. A. MACDONELL, Boden Professor of Sanskrit at Oxford, says that it is "a short but choice collection of love stanzas containing "some highly imaginative analogies, elaborated with much "originality." I accordingly now venture to give it to the public.

CUDDAPAH,
2-8-1910.

TADURI LAKSHMI NARASIMHA ROW.



# శృంగారతిలకము.

మ॥ వదనాబ్జంబును బాహునాళములు లావణ్యాప్తి చన్జక్కవల్
కుదురై వెల్గు పిఱుందు మెల్లు కనుమీఁలుం గొప్పునాఁ జొప్పఁగా
నదిరా చాతురితోఁ జతుర్ముఖుఁడు రమ్యంబౌ సరశ్శ్రేష్ఠమున్
మదనాస్త్రానల దగ్ధ పూరుష శుభ స్నానార్థమై చేసెఁగా॥ 1

చ॥ ఇదె మధురాత్రి వచ్చె విభుఁ డింతకు రాఁ డికనగ్నిఁ బ్రాణముల్
వదలి పికమ్ముఁ బట్టఁగ ను వ్యాధుఁడనై తగఁ జంద్రుఁ బట్టఁగా
విదితపు రాహువై యలరు విల్తునిఁ బట్టఁగ రుద్రు కన్నునై
మదమున నేప నిప్పతిని మారుఁడనై మఱి పుట్టఁ గోరెదన్॥ 2

ఉ॥ నల్లనికల్వ పెట్టి నయనంబులు పద్మము పెట్టి మోమునున్
మల్లెలు పెట్టి పల్వరుస మానుగ లేఁజిగురాఁకు పెట్టి యా
నల్లలితంపుమోవి కడుఁ జక్కనిసంపెఁగ పెట్టి మేను నీ
యొల్లను జేసి కాంత విధి యేటికి గుండియ ఱాతఁ జేసెనో॥ 3

చ॥ కమలదళంబుమీఁద నొక కాటుకపిట్టను జూచినంతనే
రమణను వచ్చుఁ జుమ్మి చతురంగబలాధిపతిత్వ మన్న నీ
కమలముఖంబులోని కనుకాటుకపిట్టలు రెంటి చూడఁగా
రమణిరో యేమివచ్చునో ధరాస్థలి నా కెఱుఁగంగ రాదుసూ॥ 4

శా॥ ఏ శే రంబుజమందు ఖంజన మొకం డే గందురో యెన్నఁడే
వారు న్వారుఁ గవీంద్రులై క్షితిపులై వర్ధిల్లు చుండంగ నే
శే రీక్షింతురు నేత్రఖంజనయుగం బీనీముఖాబ్జంబునన్
వారు న్వారు ననంగబాణవికలుల్ భామా కడుం జోద్య మా॥ 5

మ॥ చెలి చంద్రగ్రహణమ్ము వేళ చనుదెంచె న్నీకు నిక్కమ్ముగా
వెలి నుండం దగ దమ్మ లోపలికి వే వే పొమ్ము నీ దైన ని
ర్మలమౌ మోమును జూచి పూర్ణశశి నారాహుగ్రహం బక్కటా
మలఁగ న్వీడుచు నీ ముఖేందుఁ గబళింపం జూచుఁ జంద్రాననా॥ 6

చ॥ చెలి మృగనాభిపత్త్రములు చెక్కిళులందున మాయ వచ్చెఁ జ
న్నులమయి పూఁత రాల ద కనుంగవ కాటుక తగ్గ దయ్యెఁ బెం
దల మఱి దయ్యె మోవిపయిఁ దమ్మరసంబున నైనరక్తిమం
బలగితో నీవు నీదు పతి యుర్వ్వకుఁ డొక్కొ మదేభగామినీ॥ 7

మ॥ వనితా యల్ల మగండు నల్గఁ డతఁడుం బాలుండు వృద్ధుండు గాఁ
డును పుత్త్రుండు కురూపి రోగి యబలుండుం గాఁడు తా నాశకుం
డును గాఁడుం జవరాలిఁ జంద్రముఖి నన్నుం జూచి పువ్విల్తుతాఁ
కున మోహిల న్నిగవిడ్చి దైత్యగురు సిగ్గుం జెంది వెన్దీసెఁ జూ॥ 8.

శా. ఎట్టెట్టో కడుఁ బెద్దకాలమున కింతీ వచ్చె నాభర్త తా
నట్టైనన్ పగ మైనరేయి చన నయ్యె దేశవార్తాలితోఁ
గట్టా పిమ్మట వేడ్క వానివయి నల్కం బూని యే నుండఁగా
నిట్టీతూరుపుదిక్కునా సవతియట్లె యెఱ్ఱవాఱెం గదే॥ 9

శా. మేలే పాడగు కట్టెదెబ్బ పడుటల్ మే లెండలో మాఁడుటల్
మేలే మేనను బాడి పూఁతలు బళే మేల్నిప్పులోఁ గాలు టి
ట్లేలంటేఁ గుచపార్శ్వబాహులతికాహిందోళలీలాసుఖం
బీలాగబ్బెను గుండ నీకు శ్రమ లేకేలబ్బు సౌఖ్యం బిలన్॥ 10

శా॥ మోమున్ మోమునఁ జేర్చి యేల బలిమిన్ ముద్దాడె దో సిగ్గడీ
వామైజారును నీకు మొట్లు శర పొందం బల్కె వంచించెదే

నీమేల్కాల్పున రాత్రి నే బడలితిన్ లే పొమ్ము దానింటికే
నేమం బొప్పెడు తేఁటిపెంటి కగునే నిర్మాల్యదామం బిలన్॥ 11

మ॥ చన బేహారముఁ గూర్చి నాదు పతి తత్పద్వార్త రా దయ్యెఁదా
ననుఁగుంగూఁతురుచూలు దాల్పఁబుగుడో యంబో యెమాయత్తయిం
టను నేకాకినిఁ గొత్తకోడల నవోఢన్ సూర్యదేవుండు గ్రుం
కె నిట న్నిల్వక పాంథ యొండయిన చక్కిం జేరుమా వేగమే॥12

మ॥ విను మీరాత్రే ఘనమేఘబృందములచే భీమాంధకారంబ యై
తనరెం బల్పనిపాటులం దలసి నిద్రిం జెందె నాచేటికా
జన మే బాల వడంకుచుంటిని మనోజత్రాసభూతంబుచే
తను దొంగల్ కడుఁ జేఁగినారు పురిఁ బాంథా నిద్ర మేల్కాంచుమా॥13

శా॥ ఏడం బోయెదవన్న - వెజ్జుకొఱకై - యేలా - ఋజాశాంతికై -
తోడై యింట ఋజన్ హరింపఁదగు ముద్దుంగుమ్మ లేదో సఖా
మాడం జేయును వాతపిత్తముల శ్లేష్మం బింతిచన్బట్టులె
య్యేడన్ స్వాదుముఖామృతంబు నలవుప్పేప్పాహావక్రీడయున్॥14

మ॥ నెలఁతా నీకనుఁబోలు కల్వపువ్వు మున్గె న్నీళ్లలో నీమొగం
బలరం బోలెదు చందమామయును దా నామబ్బులో దూరె ని
శ్చలత న్నీనడ నేర్చికొన్న కలహంసల్ ప్రాయె దూరమ్ముగాఁ
జెలి నీసాటినిన్నైనఁ జూతమనఁగాఁజీ దైవమోర్వండుహా॥ 15

శా॥ అయ్యెంజండకరుండు చందురుఁడు పిడ్గయ్యెన్ సుమందానిలం
బయ్యెన్ సూదులు పూలు నిప్పుకణమేయయ్యెంగదే చందనం
బయ్యెం దానువిషంబు తమ్మలము పా మయ్యెన్ లసచ్ఛయ్య నా
కయ్యో నెచ్చెలి దూరమైన తఱిలోఁ బ్రాణంబు బర్వయ్యెఁగా॥16

శా॥ నావిజ్ఞాపన మాలకింపఁగదవే నానాథ కొన్నైననా
ళ్ళే వందే కడపంగ వేఁడెదను జుమ్మీ దేశకాలస్థితుల్
కావే మంచివి సుమ్మి యేమిటికనంగా నాలకింపంగదే
పూపుంబోఁడులమీఁదఁ జంద్రకిరణంబుల్ వేఁడిమైతోఁ చెడిన్॥ 17

మ॥ వలఁగళ్యాణిరో చందనాదులను మేనం బూసి యెల్లైననుం
జెలి చేఁగొంపుము రెండుమూఁడుదినముల్ చెన్నార నే వచ్చి య
వ్వల ని న్నాతొడమీఁదఁ జెట్టి ప్రియమొప్పం గౌఁగిటంజేర్చి శీ
తల మావట్టుల సూర్యరశ్మి నయినం దథ్యంబుగాఁ జేసెదన్॥ 18

చం॥ అతులితమన్మథానలశిఖాళి శరీరములోన దూఱి తా
సతతము మండుచుండఁ బయిచందనలేపము లేమికార్యమా
సతతము గుమ్మరావమునఁ జక్కఁగఁ బూసిన యట్టి మన్ను దే
వితమునఁ దాపహారియగుఁ జెద్దయుఁ దాపకరంబ కాకిలన్॥ 19

మ॥ పరఁగ న్వాంగవిలాసినీనయనశోభం గాంచి లజ్జింపుచున్
వరమా నేరుపుగల్గులే ళ్లడవికిం బాఱంగ నవ్వారివా
గురువా చన్నుల కోడియుం గదల వేస్గుల్ పెద్దమత్తిల్లుచున్
ధర మూర్ఖుల్ కర మోడియుం దురభిమానం బేద రెన్నండునున్॥20

చ॥ తనర మదేభకుంభగతిఁ దద్ద వెడందయి కుంకుమార్ద్రమై
చనుచెలిచన్నుదోయిపయిఁ జయ్యనఁ బేఱుటురమ్ము చేర్చి త
ద్ఘన భుజపంజరంబునను గమ్మగ నిద్ర నిమేష మంది కాం
చను నవవిల్తుపోరఁ గడుఁ జొక్కినయాతఁడు ధన్యతం ధరన్॥ 21

శా॥ అమ్మా రోహిణి యీనిశాకరున కిల్లాలైతి వెల్లన వే
గమ్మే నీనికి బుద్ధిచెప్పి చెడుఁ బోకల్ మాన్పు నాయింటిలోఁ

గోమార్గ యాతేఁడు జాలమార్గములఁ గోర్కుల్ మీఱ రేఁజొచ్చి తా
నెమ్మి న్నాపిఱుఁదంటెఁ జెప్పు మిది యింతీ వంశధర్మంబఁటే॥ 22

మ॥ భువి సౌఖ్యంబిది దుఃఖమిద్ది యనుచుం బొందొంద నాలేని వ
స్తువొకానొక్కటి యొక్కమంచమతి రోఁతో మోహమ్ముం జాడఁ జీ
వువిల్తుండు వికాసిసేయువయ సుప్పొంగించు మోదంబుచే
వివశావస్థను వొల్గు చంద్రముఖి నీవీమోక్ష మే మోక్ష మా॥ 23

ఉ॥ చిక్కనిచన్ను లో రమణి చిక్కినవ్వై యిటు వాలి నంచు నీ
వెక్కుడు చింతసేయ నవియేమిటికమ్మ వివేకహీనతన్
మిక్కిలి స్తబ్ధతం జనులనెమ్మదిఁ గాల్చుచు విఱ్ఱవీఁగెనే
నెక్కుడువాఁడు తాఁ బడఁడె యీధరలో నిది యొక్కచిత్రమే॥ 24

తే॥గీ॥ చెఱకువిల్కాని పూబంతి చిగురుఁబోణి
రమణి కర్ణాంతలోచన రాజవదన
అరిగెద వదేమి నామనః స్వపహరించి
యిపుడ రాజకమయ్యెఁగా యెల్లఁజూడ॥ 25

మ॥ ఇల దుర్గంబగు మార్గమందు విధి నెప్డే తొట్రుపాటొంది తా
నలసన్నంబగు నడ్మసున్న యగునే నోఁగాక మాదోష మే
బలమౌ చిక్కనిచన్నుగుబ్బలులు తోత్రివం బోవ నడ్డంబునౌ
కలికీ యంచును జెప్పఁగాను జెవిదాఁకంబోయెఁ గందోయి యే॥ 26

మ॥ మగువా నాపయిఁ గోపమేని మది భామా వేఱుమార్గంబునం
బగసాధింపఁ గడంగనేల యడలింప న్నన్ను ని న్నే నిటం
దగ ముద్దాడుట కౌఁగలించు టకటా తప్పైన వేమాఱు నా
వగుముద్దాటలు కౌఁగిలింతలును గాంతా నాకు నీరావఁటే॥ 27

మ॥ అలుకల్ మానుము భామ నాపయిన విన్నా మాటబద్ధంబు నే
మ్మలుగం బోలున నీదు సేవకునిపై నమ్మాటయే నమ్మితే
లలినీ వేతులతోడఁ గట్టి పలుఁగాట్లం గర్చి చన్గుబ్బపో
టులనుం బొడ్చు కటాక్షబాణముల వేటుల్ వేయవే వేఁడెదన్॥ 28

ఉ॥ వడ్డని బిందెపెట్టికొని నాథన మోమయి ముద్దుగుమ్మరో
దొడ్డగ ముద్దుగారు నలతొంగలి ఱెప్పలు వాల్చిచూచెదే?
ఒడ్డుము నీకు యోగ్యుఁడగు నొండొకపూరుషు మీఁద దృష్టి నే
వడ్డిని బిందెగల్గు నెలనాగకు సేవ యొనర్ప నేర్తునే॥ 29

మ॥ ననుఁ దేర్పంగ నిజంబు చెప్పు మరుబాణవ్రాతఘాతంబుచే
తను నీమీఁదను దృష్టినిల్పి పరిచింతం బొందు చే నున్నదా
వను నీయచ్చగు నందగాఁ డొకఁడు తా నన్యాసియున్నాఁడు నా
కును దానుండు ప్రవాసియౌతఁడితఁడొక్కో యంచుఁ దోఁచెన్మదిన్॥ 30

ఇది శ్రీ కాళిదాస మహాకవి ప్రణీతంబైన సంస్కృత
మాతృకనుండి తాడూరి లక్ష్మీనరసింహ
రాయనిచేఁ దెనిఁగింపఁబడిన
శృంగార తిలకము.



